**Kufu, Beradarivad aur Islam**
**(Telugu)**

# వివాహ సంబంధాలు అసమానతా భావాలు - ఇస్లామ్

మూలం

**రియాజ్ అహ్మద్**

అనువాదం

**అబ్దుల్ వాహెద్**

# విషయసూచిక

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# వివాహసంబంధాలు అసమానతాభావాలు - ఇస్లామ్

ఇస్లామ్‌లో వైవాహిక సంబంధానికి స్త్రీపురుషులిద్దరు సామాజికంగా సమానస్థాయి కలిగి ఉండాలన్న నిబంధన ఏదీ లేదు. ఇద్దరు ముస్లిములైతే షరిఅత్ ప్రకారం నికాహ్ ధర్మసమ్మతమే. సామాజికస్థాయి రీత్యా ఇరువురు సమానులైనా కాకపోయినా నికాహ్‌లో ఎలాంటి అభ్యంతరం ఉండదు.

కాని నికాహ్ తర్వాత వైవాహిక జీవితం ఆనందదాయకంగా కొన సాగాలంటే, దంపతుల మధ్య జీవితాంతం ప్రేమానురాగాలు నిత్య నూతనంగా వికసించాలంటే కొన్ని విషయాలను దృష్టిలో ఉంచుకోవడం అవసరం. అవేమంటే, ఇరువురి అలవాట్లు, జీవనసరళి, కుటుంబంలో ఆచారవ్యవహారాలు, ఆర్థిక, సాంఘిక స్థాయి వగైరా విషయాల్లో ఇరువురి మధ్య సారూప్యం ఉన్నట్లయితే ఆ దంపతుల మధ్య పొరపొచ్చాలు వచ్చే అవకాశాలు చాలా తక్కువ. అందువల్ల ఇస్లామ్ ఈ సమానత్వాన్ని అభిలషిస్తుంది. పెళ్ళికి ముందు వధూవరుల మధ్య ఈ విషయాల్లో సమానత్వం ఉండేలా చూడడాన్ని ఇస్లామీయ పరిభాషలో కఫూ అంటారు. భార్యా భర్తల మధ్య వారి పద్ధతులు, కుటుంబ ఆచారవ్యవహారాలు, సాంఘికస్థాయి వగైరా విషయాల్లో సారూప్యం లేనట్లయితే వారిరువురి మధ్య దూరం ఏర్పడుతుంది. ఇలాంటి పరిస్థితిలో ఆ దంపతుల మధ్య జీవితాంతం ప్రేమానురాగాలు ఉంటాయని ఆశించలేము. అందువల్లనే ఇస్లామీయ చట్టం ఇలాంటి సంబంధాలను వ్యతిరేకిస్తుంది.

కాని వివాహానికి సంబంధించి ఇస్లామీయ చట్టం పేర్కొనే నియమాన్ని చాలా మంది తప్పుగా భాష్యం చెప్పడం జరుగుతుంది. కొన్ని వంశాలు, కొందరి కుటుంబాలు గొప్పవని, కొన్ని వంశాలు, కొందరి కుటుంబాలు తక్కువ స్థాయికి చెందినవని తీర్మానిస్తూ, గొప్ప వంశాల వారికి నిమ్న వంశాలవారికి మధ్య వైవాహిక సంబంధాలు ఇస్లామ్‌లో అభ్యంతరకరమైనవని చెబుతుంటారు. నిజానికి ఇలా భావించడం ఇస్లామ్‌కు పూర్తిగా వ్యతిరేకమైన విషయం. ఈ నిమ్నోన్నతలను రూపుమాపడానికే ఇస్లామ్ అవతరించిందన్న వాస్తవాన్ని అందరూ గుర్తించ వలసి ఉంది. ఈ విషయాన్ని ప్రవక్త ముహమ్మద్ (స) తన చివరి హజ్ ప్రసంగంలో స్పష్టంగా ప్రకటించారు.

**"తెలుసుకోండి అజ్ఞానకాలం నాటి సమస్త పద్ధతులు, ఆచా రాలు నా కాళ్ళ క్రింద ఉన్నాయి.." అని ప్రకటించా రాయన.**

అల్లాహ్ ఈ విషయమై ఇలా సెలవిచ్చాడు.

**"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి ఒకే స్త్రీ నుంచి సృష్టించాము. తర్వాత మీరు ఒకరినొకరు పరి చయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగా, తెగలుగా చేశాము, వాస్తవానికి మీలో ఎక్కువ భయభక్తులు కలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు"**

(అల్ హుజురాత్ 13)

ఇమామ్ బగ్వీ (రఅ), అల్లామా అల్లావుద్దిన్ బగ్దాదీ (రఅ)లు ఈ ఖుర్‌ఆన్ వాక్యాన్ని వ్యాఖ్యానిస్తూ ఇలా రాశారు.

**"మీరందరూ జాతి రీత్యా సమానులు."**

ఇమామ్ నస్‌ఫీ (రఅ) అల్లామా జమ్‌ఖుష్రీ (రఅ)లు ఇలా వ్యాఖ్యా నించారు. **"మీరందరూ జాతి రీత్యా ఒక్కటే, ఎలాంటి తేడా లేదు. అందువల్ల జాతి తెగల పేరిట గర్వించే అవకాశమే లేదు."**

అల్లామా మహ్లబ్ (రఅ) ఇలా రాశారు. "అజ్ఞానకాలంలో అరబ్బులు వంశ ఔన్నత్యానికి చాలా ప్రాముఖ్యం ఇచ్చేవారు. కాని అల్లాహ్ ధర్మపరాయణత్వానికి, దైవభీతికి వంశ ఔన్నత్యంలో ఎలాంటి సంబంధం లేకుండా చేశాడు."

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఇలా అన్నారు : "ఇతరుల కన్నా తాను ఉన్నతుడినని చెప్పే వ్యక్తి ఈ ఖుర్ఆన్ వాక్యాన్ని వ్యతిరేకిస్తున్నాడు. ఎందుకంటే దేవుని వద్ద ధర్మపరాయణత్వానికి, దైవభీతికి మాత్రమే ఔన్నత్యం ఉంది."

బెజావి (రఅ) ఇలా రాశారు : "మీరందరూ జాతిరీత్యా సమానం. అందువల్ల జాతి పేరిట గర్వించే అవకాశమే లేదు."

అల్లామా ఖర్తబీ (రఅ) ఇలా రాశారు : "ఈ ఖుర్ఆన్ వాక్యం నొక్కి చెబుతోంది. కఫాఅత్ (పెళ్ళిలో సరిజోడి) అన్నది జాతికి సంబంధించినది కాదు. ఇది కేవలం ధర్మానికి సంబంధించినది మాత్రమే."

ఈ ఖుర్ఆన్ వాక్యం అవతరించిన నేపథ్యం కూడా గమనించ దగినది. హజ్రత్ అబూహింద్ (రజి) స్వేచ్ఛ పొందిన బానిస, ఆయన క్షురకవృత్తి చేసేవారు. అరబ్బుల్లో బను బయాజియా తెగ ఉన్నతమైన తెగగా చెలామణీ అయ్యేది. హజ్రత్ అబూహింద్ (రజి)కు అమ్మాయినిచ్చి పెళ్ళి చేయాలని బనూ బయాజియా తెగవారిని ప్రవక్త (స) ఆదేశించారు. కాని బను బయాజియా తెగవారికి తమ అమ్మాయిని బానిసగా బతికిన వ్యక్తికిచ్చి వివాహం చేయడం నచ్చలేదు. "మా తెగ అమ్మాయిని బానిసకిచ్చి చేయాలా?" అని ప్రశ్నించారు. ఈ సందర్భంగా పైన పేర్కొన్న వాక్యం అవతరించింది.

ఈ ఖుర్ఆన్ వాక్యంలో ప్రస్తావించబడిన వాస్తవాలను ఆ తర్వాత ప్రవక్త (స) మరింత వివరంగా తన ప్రవచనాల్లో విశదీకరించారు. చివరి హజ్ ప్రసంగంలో ప్రవక్త (స) ఇలా అన్నారు:

"ప్రజలారా! తెలుసుకోండి మీ ప్రభువు ఒక్కడే. మీ పూర్వీకుడు కూడా ఒక్కడే. అరబ్బుకు అరబ్బేతరునిపై, అరబ్బే తరునికి అరబ్బుపై, తెల్లవానికి నల్లవానిపై, నల్లవానికి తెల్లవానిపై ఎలాంటి ఆధిక్యతా లేదు - దైవభీతి విషయంలో తప్ప. ఒక ముస్లిం మరొక ముస్లిమునకు సోదరుడు. ముస్లిములందరూ పరస్పరం సహోదరులు." (అబూదావూద్)

ఆయన ఇంకా ఇలా అన్నారు :

"అహంకారం, తాతముత్తాతల పేరిట గర్వాతిశయాలను అల్లాహ్ తుడిచివేసాడు. ఇప్పుడు మనిషి పవిత్రమైన విశ్వాసి లేదా దురదృష్టవంతుడైన పాపాత్ముడు (రెండువర్గాల్లో ఏదోఒకదానికి చెందినవాడు మాత్రమే) అవుతాడు." (మిష్కాత్)

"ఆచరణల వల్ల వెనక్కినెట్టబడిన వ్యక్తిని అతడి వంశం ముందుకు తోయలేదు." (తిర్మిజి)

"వంశం తెగల పేరిట గర్వించడం అజ్ఞానం." (ముస్లిమ్)

***"ముస్లిముల గౌరవోన్నతులకు మూలం వారి దైవభక్తి. వారి ధర్మమే వారి జాతి."*** (తిర్మిజి)

"మీ పూర్వీకులపై ఎలాంటి ఆక్షేపణా లేదు. మీలో ప్రతి ఒక్కడు ఒక నిండుకుండ మరొక నిండుకుండతో సమానమైన మాదిరిగా సమానులు. ధర్మపరాయణత్వం, దైవభీతుల ఔన్నత్యం తప్ప మరో ఔన్నత్యం ఏదీ లేదు." *(ముస్నద్ అహ్మద్, బైహాకి)*

"అందచందాలు చూసి స్త్రీని పెళ్ళాడవద్దు. అందచందాలు వారిని పెడద్రోవ పట్టించవచ్చు. అలాగే ఆస్తిఐశ్వర్యాలు చూసి స్త్రీని పెళ్ళాడవద్దు. వారి సంపద వారిలో తలబిరుసుతనానికి కారణం కావచ్చు. ధర్మపరాయణత్వం, నైతికతలను చూసి పెళ్ళి చేసుకోండి. దర్మపరాయణురాలైన నల్లని బానిసస్త్రీ కూడా ఎంతో ఉత్తమమైనది." *(ఇబ్నుమాజా)*

"గౌరవోన్నతులు పొందాలన్న ఉద్దేశ్యంతో ఎవరైనా స్త్రీని పెళ్ళాడితే ఆ వ్యక్తి పరాభవాలను అల్లాహ్ పెంచుతాడు. సంపద కోసం స్త్రీని పెళ్ళాడిన వ్యక్తికి అల్లాహ్ దారిద్ర్యాన్ని పెంచుతాడు. వంశప్రతిష్ఠ కోసం స్త్రీని పెళ్ళాడిన వ్యక్తికి అల్లాహ్ అప్రతిష్ఠ పెంచుతాడు. తన చూపులు క్రిందకు వాలి ఉండాలని, తన మర్మాంగాలు కాపాడుకోవాలని, బంధుత్వాన్ని కలుపాలని పెళ్ళాడితే ఆ వివాహంలో అల్లాహ్ సౌభాగ్యాన్ని అధికం చేస్తాడు."

"ధార్మికంగా మీకు సంతృప్తికరంగా ఉన్న వ్యక్తి కనబడితే మీరు మీ అమ్మాయి పెళ్ళి చేసేయండి. మీరు ఇలా చేయనట్లయితే భూమిపై కల్లోలం చెలరేగుతుంది." ఇది విని అనుచరులు "దైవప్రవక్త (స) అలాంటి వ్యక్తి బీదవాడైనా, లేక సామాజిక స్థాయిరీత్యా లోపం కలిగినవాడయినా కూడానా" అని ప్రశ్నించారు. ఆయన జవాబిస్తూ మూడుసార్లు ఇలా అన్నారు "ధార్మికంగా మీకు సంతృప్తికరంగా ఉన్న వ్యక్తి లభిస్తే అతనితో మీ అమ్మాయి పెళ్ళి చేసేయండి." (తిర్మిజి)

"మీరందరూ ఆదమ్ సంతానం. ఆదమ్ మట్టితో సృష్టించబడ్డారు. ప్రజలు తమ తాతముత్తాతల గురించి గర్వించడం వదులుకోవాలి. లేకపోతే దేవుని దృష్టిలో ఒక అల్పమైన పురుగు కన్నా తక్కువై పోతారు." *(బజార్)*

"అజ్ఞాన కాలం నాటి పక్షపాతాల గురించి ప్రవక్త (స)ను ప్రశ్నించగా ఆయన జవాబిస్తూ అది చెడువాసన వంటిది దాన్ని వదిలేయండి." అన్నారు. అజ్ఞాన కాలం నాటి నిమ్నోన్నతల విషయంలో పక్షపాతాల విషయంలో దేవుడు, దైవప్రవక్త(స) స్పష్టంగా చేసిన ఉపదేశాలు ఉన్నాయి. కాని వాటిని వదిలి, నకారాత్మకమైన ఆచారవ్యవహారాలకు ప్రాధాన్యం ఇస్తూ జాతి, వృత్తి, సముదాయం, వంశం వగైరా ప్రాతిపదికల మధ్య ముస్లిములను విభజించడం కనబడుతోంది. వివాహ సమయంలో ధర్మపరాయణత్వం, దైవభీతులకు ప్రాముఖ్యం ఇచ్చేబదులు వాటికి రెండవ లేదా మూడవ స్థాయి ప్రాధాన్యం ఇస్తున్నారు. పరస్పర గుర్తింపు కోసం అని ధర్మం స్పష్టంగా

పేర్కొన్న విషయాన్ని నిమ్నోన్నతలకు ప్రమాణంగా మార్చివేయడం జరిగింది. వృత్తి, వంశం వంటి వాటికి ఔన్నత్యంతో ముడిపెట్టడం జరిగింది. వేటి పేరిట గర్వించడాన్ని దేవుడు, దైవప్రవక్త (స) అజ్ఞానంగా తీర్మానించారో వాటినే నేడు ఔన్నత్యానికి లేదా న్యూనతకు ప్రమాణాలుగా పరిగణించడం జరుగుతోంది.

షరీఅత్ ప్రకారం రెండవస్థాయి ప్రాముఖ్యం కలిగిన అంశాలకు నేడు ప్రథమ ప్రాధాన్యం లభిస్తోంది. తక్కువస్థాయి వంశంతో ఉన్నత స్థాయి వంశం పెళ్ళి సంబంధాలు కలుపుకోవడాన్ని అభ్యంతరకరంగా భావించడం జరుగుతోంది. అంటే పెళ్ళి సంబంధాలు వంశాల మధ్య కుదురుతున్నాయి. తమ వంశానికి బయట పెళ్ళి సంబంధాలు కలుపుకున్న వారు దాదాపు బహిష్కరణకు గురవుతున్నారు. నేడు దేశంలో ముస్లిముల మధ్య కనబడుతున్న ఈ అసమానతలు, నిమ్నోన్నతా భావాలలో వంశం, సముదాయం, వృత్తి మొదలైన వాటికి ప్రాముఖ్యం ఇవ్వడం కనబడుతుంది. ఇది కులతత్వంతో పోలినదే అని చెప్పాలి.

చివరి ప్రవక్త (స) అనుయాయులుగా చెప్పుకునేవారు, జాతి, తెగ, వంశాల అహంకారాన్ని, అజ్ఞాన కాలంనాటి సమస్త గర్వాతిశయాలను నిర్మూలించడానికి వచ్చిన ప్రవక్త (స) అనుచరసమాజం అదే అజ్ఞానకాలం నాటి కల్లోలానికి, రుగ్మతకు గురైంది. ఈ పరిస్థితి విషయమై ప్రవక్త (స) హెచ్చరించారు. ఈ విషయమై వారించారు.

ముస్లిం సముదాయంలో ఈ రుగ్మతకు చాలా కారణాలు ఉన్నాయి. ఒక ప్రత్యేక కాలంలో ఇస్లామీయ ధర్మశాస్త్రం రూపొందింది. దానితో పాటు అప్పటి నిర్వచనాల ప్రకారం వైవాహిక సంబంధాలలో సరిజోడి అన్న విషయం కూడా చోటుచేసుకుంది. నిజానికి ధర్మంలో దీనికి ఎలాంటి ప్రాముఖ్యం లేదు. తర్వాతి కాలాల్లోని ధర్మవేత్తలు కూడా ఈ

విషయాన్ని విమర్శనాత్మకంగా సమీక్షించడం జరుగలేదు. ఇది ఒక ధార్మిక విషయంగా ఆమోదిస్తూ వచ్చారు. ఆ విధంగా ధర్మంలో ఉన్న కఫాఅత్ పరిధిలో జాతి, వంశం, సముదాయం, వృత్తి మొదలైనవి కూడా చేరి పోయాయి. వివాహ సందర్భంగా ఇస్లామ్ కఫాఅత్ చూడమని చెప్పింది. ఆ కఫాఅత్ నిజానికి ధర్మపరాయణత్వం, దైవభీతులకు సంబంధించినది. ఈ విషయాన్ని దైవగ్రంథం, ప్రవక్త ప్రవచనాలు స్పష్టంగా తెలుపుతున్నాయి. ఈ ఉపదేశాలను పాటించాలని నొక్కి చెప్పడం కూడా జరిగింది. మాలికి పంథాను అనుసరించే ధర్మవేత్తలు కఫాఅత్ విషయంలో ధర్మపరాయ ణత్వం, దైవభీతులకు తప్ప మరిదేనికి విలువ ఇవ్వడానికి సిద్ధపడరు. ఎందుకంటే ఇతర విషయాలు ఏవీ దైవగ్రంథం, ప్రవక్తప్రవచనాల రీత్యా నిరూపించబడినవి కావు.

ఇతర పంథాల ధర్మవేత్తలు కఫాఅత్ పరిధిలో అంగీకరించే విషయాలకు ద్వితీయ ప్రాధాన్యం మాత్రమే ఉంది. అవి ధర్మపరాయ ణత్వం, దైవభీతుల తర్వాతి హోదా మాత్రమే కలిగినవి. పైగా ఇవి అభిల షించదగినవి అన్న స్థాయిలో మాత్రమే ఉన్నాయి. తప్పనిసరిగా పాటించ వలసినవి కావు. ఈ విషయాలేవి స్పష్టమైన ప్రమాణాల రీత్యా నిరూపించ బడినవి కావు. నిజానికి ఇవన్నీ అలవాట్ల కారణంగా, కొన్ని పరిస్థితుల కారణంగా ఆయా ధర్మవేత్తలు వెలిబుచ్చిన అభిప్రాయాలు మాత్రమే. ఇలాంటి అభిప్రాయాలకు షరీఅత్ రీత్యా ద్వితీయ స్థాయి మాత్రమే లభిస్తుంది. షరీఅత్ స్ఫూర్తికి విరుద్ధంగా లేనప్పుడు మాత్రమే ధర్మవేత్తల ఇలాంటి నిర్ణయాలకు అభిప్రాయాలకు విలువ ఉంటుంది. అందువల్లనే ఈ విషయమై డాక్టర్ వహబుజ్జహేలీ ఇలా రాశారు "ప్రవక్త అనుచరులు, ఆ తర్వాతి కాలం వారు ఆచరించిన పద్ధతి, షరిఅత్ స్ఫూర్తికి, ధర్మశాస్త్రం మౌలిక నియమాలకు విరుద్ధంగా లేని పద్ధతికి మాత్రమే ప్రాముఖ్యం ఉంటుంది." *(ఉసూలె ఫికా ఇస్లామీ సం. 2, పే. 831)*

భ్రష్టమైన పద్ధతి గురించి అబూ జహ్రో ఇలా వివరించారు. "దైవ గ్రంథం, ప్రవక్త ప్రవచనాలలోని స్పష్టమైన ఆదేశాలకు విరుద్ధమైనవి భ్రష్టఆచారం" *(ఉసూలుల్ ఫికా పే.655)*

విశ్వసించదగిన పద్ధతి ఏదన్న విషయమై ఇమామ్ షాతబీ (ర) ఇలా వివరించారు "షరీఅత్ ప్రకారం విశ్వసించదగినవి మాత్రమే సక్రమమైనది. అంతేకాని స్వంత ఇష్టాయిష్టాలకు అనుగుణమైనది కాదు."

*(అల్ మవాఫిఖాత్)*

కొందరు ధర్మవేత్తల అభిప్రాయాలు, మధ్యయుగాల్లో అప్పటి ప్రత్యేక సామాజిక కారణాల వల్ల నేడు ముస్లిం సముదాయంలో జాతి, వంశం, వృత్తి వగైరాలకు సంబంధించిన భేదభావాలు చోటుచేసుకున్నాయి. నిమ్నోన్నతలు దారి చేసుకున్నాయి. ప్రారంభకాలంలోని ధర్మవేత్తలు కఫాఅత్‌కు సంబంధించి ఏఏ షరతులు చెప్పారో వాటిని నేటి దర్మవేత్తలు పెళ్ళికి షరతులుగా నిర్ణయించేశారు. నిజానికి నికాహ్ షరీఅత్ ప్రకారం జరగడానికి ఇద్దరూ ముస్లిములై ఉంటే చాలు. ఇద్దరి మధ్య సామాజిక సమానత్వం (కుఫ్) ఉండడం నికాహ్‌కు తప్పనిసరి ఎంతమాత్రం కాదు. కుఫ్ అన్నది నికాహ్ జరగడానికి షరతు కాదు, నికాహ్ తర్వాత ఆనందదాయకమైన జీవితానికి, ఆ తర్వాత దాంపత్యం చిరకాలం కొనసాగడానికి సంబంధించినది. ఈ విషయమై ముఫ్తీ కిఫాయతుల్లా అభిప్రాయం ఏమంటే "దైవగ్రంథం, ప్రవక్త ప్రవచనాలు, అనుయాయులు, ఆ తర్వాతి వారి ఆచరణలు చెబుతున్న సాక్ష్యాల ప్రకారం చూస్తే జాతి, వంశాల విషయంలో సమానత్వం అన్నది నికాహ్‌కు షరతు కాదని తెలుస్తోంది." (కిఫాయతుల్ ముఫ్తీ సం.5, పే. 22)

ఇప్పుడు మనం ధర్మవేత్తలు కఫాఅత్ విషయమై ఆధారాలుగా చూపించే హదీసుల గురించి ఆలోచిద్దాం. మౌలానా మసూద్ ఆలమ్

ఫలాహీ రాసిన 'మసలా కఫాఅత్' వ్యాసం నుంచి ఈ విషయాలు గ్రహించడం జరిగింది. ఈ వ్యాసం 'జిందగీ', నవంబర్ 2002, ఫిబ్రవరి, మార్చి 2003 సంచికల్లో ప్రచురితమైంది. మరిన్ని వివరాల కొరకు ఆ సంచికలు చూడగలరు.

కఫాఅత్ విషయంలో నలుగురు ధర్మవేత్తల మధ్య భేదాభిప్రాయాలు కనబడతాయి. హనఫీ పంథాలో కఫాఅత్ పరిధిలో ఆరు అంశాలు ఉన్నాయి. అవి : ధర్మపరాయణత్వం, వంశం, వృత్తి, సంపద, స్వేచ్ఛ, పుట్టుకతో ముస్లిం లేదా నవముస్లిం. షాఫయి పంథా, హంబలీ పంథాలలో కూడా దాదాపుగా ఇవే అంశాలు కొద్దిపాటి భేదాలతో ఉన్నాయి. మాలికి పంథాలో కేవలం ధర్మపరాయణత్వానికి తప్ప మరిదేనికి చోటు లేదు.

## ధర్మపరాయణత్వం, దైవభీతి విషయంలో కఫాఅత్

ధర్మపరాయణత్వం, దైవభీతుల విషయంలో ధర్మవేత్తలు క్రింది ఆయతులను ఆధారాలుగా పేర్కొంటారు. ఈ విషయంలో నాలుగుపంథాల ధర్మవేత్తల మధ్య ఏకాభిప్రాయం ఉంది. అవి :

**అపవిత్ర స్త్రీలు అపవిత్ర పురుషుల కొరకు, అపవిత్ర పురుషులు అపవిత్ర స్త్రీల కొరకే, పవిత్ర స్త్రీలు పవిత్ర పురుషుల కొరకు, పవిత్ర పురుషులు పవిత్ర స్త్రీల కొరకే.** (అన్నూర్ : 26)

వాస్తవానికి మీలో ఎక్కువ భయభక్తులు కలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు." (అల్ హుజురాత్ 13)

**ధర్మం, నైతికత విషయంలో మీకు నచ్చిన యువకుని సంబంధం మీవద్దకు వస్తే, అతనితో సంబంధం కలుపుకొండి. మీరు ఇలా చేయకపోతే భూమిపై కల్లోలం చెలరేగుతుంది.** (తిర్మిజి)

**నాలుగు కారణాల వల్ల స్త్రీని వివాహమాడడం జరుగుతుంది. అవి: ఆమె సంపద, వంశం, సౌందర్యం, ధర్మపరాయణత్వం. మీరు ధర్మపరాయణురాలైన స్త్రీని వివాహమాడండి. అల్లాహ్ మీకు సౌభాగ్యం ప్రసాదిస్తాడు.**

*(బుఖారి, ముస్లిమ్)*

## సంపద విషయంలో కఫాఅత్

సంపద విషయంలో కఫాఅత్ పాటించాలా లేదా అన్న విషయమై ప్రవక్త ప్రవచనాల విషయంలో భేదాభిప్రాయాలు ఉన్నాయి. ఒక ప్రవచనం ప్రకారం సంపద రీత్యా వధూవరుల మధ్య సమానస్థాయి ఉండడం అవసరం. మరొక ప్రవచనం ప్రకారం అవసరం లేదు. ఫతహుల్ ఖదీర్‌లో ఇలా ఉంది : "సంపాదించి తన భార్యను పోషించే స్థాయి కలిగిన వ్యక్తి సంపన్నురాలైన స్త్రీతో సమానస్థాయి (కుఫ్) కలిగిఉన్నాడు."

సంపద రీత్యా సమాన స్థాయి ఉండాలని వాదించే ధర్మవేత్తలు క్రింది ప్రవచనాలను పేర్కొంటారు :

హజ్రత్ ఫాతిమా బింతె ఖైస్ (రజి) ఇలా ఉటంకించారు: హజ్రత్ మావియా (రజి)ను పెళ్ళాడవద్దని ప్రవక్త(స) ఆమెకు సలహా ఇస్తూ 'మావియా ఒక బీదవాడు ఆయన వద్ద ఎలాంటి సంపద లేదు' అన్నారు. (తిర్మిజి)

సంపదకు మారుపేరు వంశం. దైవభీతికి మారుపేరు కారుణ్యం. (తిర్మిజి)

నిస్సందేహంగా ప్రపంచంలో ప్రజలు దేని వైపు వెడుతున్నారో ఆ సంపదే వంశం. *(నిసాయి, బైహకి)*

ఈ మూడు ప్రవచనాలు ప్రామాణికమైనవే. కాని వివాహ సంబంధాలలో సంపదరీత్యా సమాన స్థాయిని ఈ ప్రవచనాలు సూచిస్తున్నాయని ఖచ్చితంగా చెప్పలేము.

ఫాతిమా బింతె ఖైస్ (రజి) మొదట ఒక సంపన్నుడైన వ్యక్తికి భార్యగా ఉన్నారు. ఆమె తన రెండవ పెళ్ళి విషయమై ప్రవక్త (స) వద్దకు సలహా కోసం వచ్చారు. మావియా(రజి), ఉసామా బిన్ జైద్(రజి) ఇద్దరిలో ఎవరితో వివాహానికి అంగీకరించాలని అడిగారు. ప్రవక్త (స) ఆమెకు ఉసామా బిన్ జైద్ (రజి)తో వివాహం చేసుకోవలసిందిగా సలహా ఇచ్చారు. ఈ సందర్భంగా ఆయన హజ్రత్ మావియా (రజి) గురించి చెప్పిన మాటలను సంపదరీత్యా సమానత్వం వివాహానికి షరతుగా చూపిస్తున్నారు. కాని వాస్తవానికి ప్రవక్త (స) ఒక ప్రత్యేక సందర్భంలో హజ్రత్ ఫాతిమా బింతె ఖైస్ (రజి)కు ఆమెకు ఎదురైన ప్రత్యేక పరిస్థితి నేపథ్యంలో ఇచ్చిన సలహా మాత్రమే అది. అందువల్ల ఈ హదీసు ఆధారంగా సంపద రీత్యా సమానత్వం వివాహానికి షరతు అని నిరూపించలేము.

ఈ హదీసు ఆధారంగా సంపద రీత్యా సమానత్వం వివాహ సంబంధం విషయంలో అవసరమని భావించడం జరిగితే ప్రామాణిక హదీసు ఇజాజా అకుమ్ మన్ తనజూన దీనహూ కు వ్యతిరేకమైనదవుతుంది. ప్రవక్త ప్రవచనాల్లో పరస్పర వైరుధ్యం ఉండదన్న విషయం ఇక్కడ దృష్టిలో ఉంచుకోవడం ముఖ్యం. అందువల్లనే ముల్లా అలీ ఖారీ (రఅ) ఈ విషయమై రాస్తూ పైన పేర్కొన్న హదీసులో సంపద రీత్యా సమానత్వం అన్నది వివాహ సంబంధానికి అవసరమని చెప్పే మాట ఏదీ ఈ హదీసులో లేదన్నారు. ఇక రెండవ మూడవ హదీసుల్లో సంపదరీత్యా సమానత్వం వివాహ సంబంధానికి అవసరమన్న మాట ఎక్కడా లేదు. ఈ మాటలను ప్రవక్త ప్రపంచంలో ప్రజల వైఖరిని గురించి చెప్పారు. ప్రపంచంలో ప్రజలు వివాహం సందర్భంగా ధర్మపరాయణత్వానికి బదులు సంపదకు ప్రాధాన్యం ఇస్తారని ఆయన అన్నారు. మూడవ హదీసులో అయితే సంపద కాదు కావలసింది ధర్మపరాయణత్వం అన్న విషయం కూడా స్పష్టంగా ఉంది. స్వయంగా ప్రవక్త (స), ఆయన అనుచరుల ఆచరణలు కూడా ఇదే విషయాన్ని నిరూపిస్తున్నాయి.

ప్రవక్త (స) హజ్రత్ సఫియా (రజి)కు స్వేచ్ఛ ఇచ్చిన తర్వాత ఆమెతో వివాహం చేసుకున్నారు. హజ్రత్ అబూ బకర్ (రజి) వంటి సంపన్నుడైన వ్యక్తి తన కుమార్తె అస్మా (రజి) వివాహం నిరుపేద అయిన హజ్రత్ జుబేర్ బిన్ అవ్వామ్ (రజి)తో జరిపించారు. జుబేర్ (రజి)తో పెళ్ళి చేసుకున్నప్పుడు ఆయన వద్ద ఏదీ లేదని, భూమి కాని, సంపద కాని ఏదీ లేదని స్వయంగా ఆమె తెలిపారు. ఆయన వద్ద పెళ్ళి జరిగినప్పుడు ఒక ఒంటె, ఒక గుర్రం మాత్రం ఉండేవి. తాను గుర్రం పోషణ చూసేదానినని ఆమె అన్నారు. (బుఖారి)

అబ్దుల్లా బిన్ మసూద్ (రజి) నిరుపేద, ఆయన భార్య జైనబ్ బింతె అబి మావియా (రజి) సంపన్నురాలు. ఆమె ప్రవక్త (స)తో "నేను నా సంపద నా భర్త కోసం ఖర్చు పెడితే నాకు సదఖా పుణ్యం లభిస్తుందా" అని ప్రశ్నించారు. అందుకు జవాబిస్తూ ప్రవక్త (స) 'రెట్టింపు పుణ్యం లభిస్తుంది. ఒకటి బంధుత్వానికి సంబంధించినది, రెండవది సదఖాకు సంబంధించినది" అన్నారు. (ముస్లిమ్)

## వృత్తిరీత్యా సమానత్వం

వంశం విషయంలో ఏ విధంగా సమానత్వం అవసరమో అదే విధంగా వృత్తిరీత్యా కూడా సమానత్వం ఉండాలని కొందరు ధర్మవేత్తల అభిప్రాయం. అందువల్ల నిమ్నస్థాయి వృత్తుల వారు అంటే, క్షురకులు, నేతపనివారు, చాకలిపని వారు వగైరా వ్యక్తులు ఉన్నతస్థాయి వృత్తులు అంటే వ్యాపారాల్లో ఉన్న వారితో వివాహ సంబంధం రీత్యా సమవుజ్జీ కాదు. అదేవిధంగా వ్యాపారులు వగైరా ధర్మవేత్తలు, ఖాజీలతో సమవుజ్జీ కాదు. ఈ విషయంలో ధర్మవేత్తలు వృత్తిహోదా కాలానుగుణంగా మారుతుందన్న విషయాన్ని కూడా అంగీకరిస్తున్నారు.

ఇమామ్ మాలిక్ (రఅ) వృత్తిని వివాహసంబంధం విషయంలో

సరిజోడి ఎంపికకు షరతుగా అంగీకరించరు. ఏ విధంగానైతే సంపద ఎల్లప్పుడు ఒకరి వద్ద ఉండడం సాధ్యం కాదో అదేవిధంగా మనిషికి వృత్తి కూడా శాశ్వతం కాదు. ఇమామ్ అబూ హనీఫా (రఅ) అభిప్రాయం కూడా ఇదే. వృత్తి విషయంలో ఆధారంగా తీసుకుంటున్న హదీసు ప్రామాణికమైనది కాదని ఆయన అభిప్రాయం. తరచు ఎదురయ్యే వ్యవహారాల్లో ఇలాంటి బలహీనమైన హదీసులను ప్రమాణంగా తీసుకోరాదన్నది ఆయన వాదన. వృత్తిని వివాహ సంబంధాల విషయంలో సరిజోడి ఎంపికకు షరతుగా భావించేవారు హజ్రత్ ఉమర్ (రజి) ఉటంకించిన హదీసును ప్రస్తావిస్తూ ఉంటారు.

"కొందరు అరబ్బులు అరబ్బులకు సరిజోడి, కొందరు అరబ్బే తరులు అరబ్బేతరులకు సరిజోడి, నేత పనివారు, క్షురకులు తప్ప."

కాని హదీసువేత్తల ప్రకారం ఈ హదీసు బలహీనమైనది, ప్రామాణికమైనది కాదు. అందువల్ల ఈ హదీసును ఆధారంగా చెప్పడానికి వీలులేదు. ఇమామ్ ఇబ్నె ఖయ్యూమ్ (రఅ) హదీసుల ప్రామాణికతకు రెండు నియమాలు సూచించారు. ఆ రెండు నియమాల ప్రకారం కూడా ఈ హదీసు ప్రామాణికమైనది కాదు. మొదటి నియమం : చర్మకారులు తదితర ధర్మసమ్మతమైన వృత్తులకు వ్యతిరేకంగా ఉన్న హదీసు ఏదీ ప్రామాణికమైనది కాదు. ఎందుకంటే దేవుడు, దైవప్రవక్త (స) ధర్మసమ్మతమైన వృత్తులను ఖండించడం జరగదు. రెండవ నియమం : అరబ్బునకు అరబ్బేతరునిపై ఎలాంటి ఆధిక్యతా లేదు.... ధర్మపరాయణత్వం రీత్యా తప్ప అని చెప్పిన హదీసు తప్ప మరే హదీసు అయినా గాని అందులో అరబ్బు అన్న పదం ఉంటే ప్రామాణికమైనది కాదు.

హదీసుగా చెప్పబడే ఈ మాటలు దైవగ్రంథం, ప్రామాణిక హదీసులు, ప్రవక్త సహచరుల ఆచరణలకు వ్యతిరేకంగా ఉన్నాయి. దేవుడు స్వయంగా ఇలా అన్నాడు :

"ఈ ప్రపంచ జీవితంలో వారి బ్రతుకుదెరువు మార్గాలను మేమే వారి మధ్య పంచాము. వారిలో కొందరికి మరికొందరిపై అంతస్తుల వారిగా ఆధిక్యం ఇచ్చాము. వారు ఒకరినొకరు సేవించుకోవడానికి." (అజ్జుఖ్రుఫ్ : 32)

"మేము ఇనుమును అతని (దావూద్ (అస) కొరకు మెత్తబడేటట్లు చేశాము. ఇలా ఆదేశిస్తూ 'కవచాలు తయారుచేయి, వాటి వలయాలను సరిగ్గా లెక్క ప్రకారం పేర్చు." (సబా : 10,11)

ఇమామ్ రాజి (రఅ) జుఖ్రుఫ్ సూరాను వ్యాఖ్యానిస్తూ అన్నారు: అల్లాహ్ సమస్త మానవులను అన్ని విషయాల్లో సమానులుగా, ఎవరూ ఎవరి సేవ చేసేవారు కాని విధంగా రూపొందించి ఉన్నట్లయితే ప్రపంచ వ్యవస్థ వినాశ మయ్యేది.

ప్రవక్త ఏమన్నారంటే, "చేతిపనుల ద్వారా సంపాదించిన ఉపాధి కన్నా ఉత్తమమైన ఉపాధి ఎవరూ తినలేరు. ప్రవక్త దావూద్ (అస)కూడా చేతి పనుల ద్వారా సంపాదించి తినేవారు."

ఏ సంపాదన అన్నింటికన్నా పరిశుద్ధమైనదని ప్రశ్నించినపుడు ప్రవక్త (స) జవాబిస్తూ మనిషి తన చేతులతో పనిచేసి సంపాదించినది, పరిశుద్ధమైన వ్యాపారం ద్వారా సంపాదించినది అన్నారు. (బజార; హాకిమ్)

దైవప్రవక్త జకరియా (అస) వడ్రంగం చేసేవారు. స్వయంగా ప్రవక్త ముహమ్మద్ (స) మేకలు కాసారు.

దైవప్రవక్త ముహమ్మద్ (స) ఇలా అన్నారు. "మేకలు కాసే పని చేయని దైవప్రవక్త ఎవరిని అల్లాహ్ పంపలేదు." అప్పుడు ప్రవక్త అనుచరులు ఆయన్ను "మీరు కూడా మేకలు కాసారా అని ప్రశ్నించారు" ఆయన జవాబిస్తూ "నేను మక్కా వాసుల మేకలను కాసేవాడిని" అన్నారు. (బుఖారి)

హ్రజత్ సల్మాన్ ఫార్సి (రజి) ఖర్జూరం ఆకులతో చాపలు అల్లేవారు. హ్రజత్ అయ్యూబ్ అన్సారీ (రజి) కూడా చేతివృత్తి చేసేవారు. హ్రజత్ అబూ హింద్(రజి) క్షురకులు. ప్రవక్త (స) ఒకసారి ఆయన గురించి మాట్లాడుతూ-

"ఎవరి హృదయంలో దేవుడు ధార్మిక విశ్వాసాన్ని పటిష్టం చేసాడో ఆ వ్యక్తిని చూడదలచుకుంటే అబూ హింద్ (రజి)ని చూడండి" అన్నారు.

ఈ ఆయతులు, హదీసుల ఆధారంగా ఫిఖావేత్తలు చేతివృత్తికి ఫర్జ్ కిఫాయా స్థాయి ఉందని పేర్కొన్నారు. అంటే సమాజంలో ఎవరో ఒకరు ఈ పని చేయడం తప్పనిసరి. లేకపోతే ఆ అపరాధం పూర్తి సమాజంపై పడు తుంది. అందువల్లనే ఇమామ్ గజాలీ ఇలా రాశారు.

"ప్రతి చేతివృత్తి ఫర్జ్ కిఫాయా అవుతుంది. మనిషి ప్రాపంచిక వ్యవహారాలు చేతివృత్తులు లేకుండా ఉండడం సాధ్యం కాదు. వైద్యవృత్తి, గణితం కూడా అలాంటివే. ఈ నైపుణ్యాలు కలవారు లేని నగరంలో ప్రజలు నానావిధమైన ఇబ్బందులకు గురికావలసి వస్తుంది. ఇదేవిధంగా మౌలిక ప్రాముఖ్యం ఉన్న చేతివృత్తులన్నీ ఫర్జ్ కిఫాయా అవుతాయి. వ్యవసాయం, నేతపని, దర్జీ, క్షురకవృత్తి వగైరాలు. ఈ నైపుణ్యాలు కలవారు లేకపోతే అలాంటి నగరంలో ప్రజలు తీవ్రసమస్యలకు గురై సమసి పోతారు." (అల్ అహ్యా)

హ్రజత్ మఖ్దూమ్ అష్రఫ్ సమ్నానీ (రఅ) ఈ విధంగా రాశారు. : "చాలామంది దైవప్రవక్తలు ఏదో ఒక చేతివృత్తిని అవలంబించారు. అందువల్ల చేతివృత్తులను తక్కువగా చూడడం కూడా దైవతిరస్కారమే అవుతుంది."

ముఫ్తి కిఫాయతుల్లా ఇలా రాశారు "ధర్మసమ్మతమైన చేతివృత్తి చేస్తున్న వ్యక్తిని తక్కువచేసి చూడడం ఇస్లామీయ ఆదేశాలు, బోధనలకు విరుద్ధమైన విషయం. ముస్లిముల్లో ఈ వ్యాధి సమాజంలోని ఇతర

సముదాయాల వల్ల జనించింది. ఈ వ్యాధి ఇస్లామీయ సమైక్యతను ముక్కలు ముక్కలు చేసింది."

## నవముస్లిములు, పుట్టుకతో ముస్లిముల కఫాఅత్

నవముస్లిములు, పుట్టుకతో ముస్లిములు ఒకరికొకరు కుఫ్ కాలేరు అని చెప్పడానికి దైవగ్రంథంలో ఎలాంటి ఆధారం లేదు, ప్రామాణికం కాని, బలహీన హదీసుల్లో కూడా ఇలాంటి సూచన ఏదీ కనబడదు. పైగా ఇలా చెప్పడం దైవగ్రంథం, ప్రవక్త ప్రవచనాలు, ప్రవక్త అనుచరుల ఆచరణలకు పూర్తిగా విరుద్ధమైనది. దైవగ్రంథంలో ఇలా స్పష్టంగా చెప్పడం జరిగింది:

**"ముష్రిక్కు మహిళలు విశ్వసించనంత వరకు మీరు వారిని ఎట్టి పరిస్థితిలోను వివాహమాడరాదు. ముష్రిక్కు కులీన స్త్రీ మీకు ఎంత నచ్చినా ఆమె కంటే విశ్వాసురాలైన ఒక బానిస స్త్రీ ఎంతో మేలు, (అదే విధంగా) ముష్రిక్కు పురుషులు విశ్వాసులు కానంత వరకు మీరు మీ మహిళలను వారికిచ్చి వివాహం చేయకూడదు. ముష్రిక్కు కులీనుడు మీకు ఎంత నచ్చినా అతడి కంటే విశ్వాసుడైన ఒక బానిస ఎంతో మేలు."** *(అల్ బఖర : 221)*

ఈ ఆయతులో స్పష్టమైన ఆదేశం ఉంది. ముష్రిక్ పురుషులు లేదా ముష్రిక్ స్త్రీలు ఇస్లామ్ స్వీకరిస్తే వారితో నికాహ్ చేసుకోవచ్చు. ఇందులో నవముస్లిం, పుట్టుకతో ముస్లిముల మధ్య పరస్పరం సరిజోడి ఉండదన్న మాట ఏదీ లేదు.

ప్రవక్త సహచరుడు సల్మాన్ ఫార్సీ (రజి) అరబ్బేతరుడు, స్వేచ్ఛ పొందిన బానిస, ఆయన గజ్వా యుద్ధం తర్వాత ఇస్లామ్ స్వీకరించారు. ఆయన హజ్రత్ అబూబకర్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి)ల కుమార్తెలతో వివాహానికి సందేశం పంపించారు. ఆ ఇద్దరు సహచరులు కూడా ఈ సందేశాన్ని అంగీకరించారు. *(అల్‌జామిఅల్ అహ్‌కాముల్ ఖుర్‌ఆన్)*

నిజానికి కొందరు ధర్మవేత్తలు వెలిబుచ్చిన పై అభిప్రాయం, అంటే పుట్టుకతో ముస్లిములు, నవముస్లిములు ఒకరికొకరు వివాహసంబంధాలకు సరిజోడి కారన్న అభిప్రాయం ఇస్లాం వ్యాప్తికి తీవ్ర నష్టం కలిగించింది. ఈ ఫత్వా వల్ల ముస్లిమేతరులు అనేకమంది ఇస్లామ్‌కు దూరమయ్యారు. ఈ చిన్న ఉదాహరణ చూడండి.

దేశవిభజనకు ముందు బిజ్నూర్ జిల్లా నట్టూర్ ప్రాంతంలో ముస్లిమేతరులైన త్యాగి చౌదరీ సముదాయం ప్రజలు ఇస్లామ్ స్వీకరించాలని నిర్ణయించారు. అయితే ఇస్లామ్ స్వీకరించిన తర్వాత ముస్లిములైన చౌదరీలతో వివాహసంబంధాలు కలుపుకోవాలన్న షరతు విధించారు. దీనిపై ముస్లిమ్ చౌదరీ సముదాయం సమావేశమై మూడు రోజులు చర్చించి, ఇస్లామ్ స్వీకరించిన తర్వాత వాళ్ళు నవముస్లిములు అవుతారు కాబట్టి, తాము పుట్టుకతో ముస్లిములు కాబట్టి వివాహసంబంధాలకు ఇద్దరి మధ్య సరిజోడి ఉండదని తేల్చారు. ఈ నిర్ణయం తర్వాత త్యాగి చౌదరీలు ఇస్లాం స్వీకరించే ఆలోచనను విరమించుకున్నారు. (మస్లా కుఫ్ ఔర్ ఇషాఅత్ ఇస్లామ్, మౌలానా అబ్దుల్ హమీద్ నోమాని)

నవముస్లిములు, పుట్టుకతో ముస్లిములు వివాహసంబంధాలకు సరిజోడి కారని భావిస్తే రెండు ప్రశ్నలు తలెత్తుతాయి. ఈ రెండు ప్రశ్నలకు రెండు విరుద్ధ సమాధానాలు లభిస్తాయి.

**మొదటి ప్రశ్న:**

"నేను ముస్లిమేతర సముదాయానికి చెందినవాడిని. ముప్ఫయి అయిదు సంవత్సరాల క్రితం ఇస్లామ్ స్వీకరించాను. ఇప్పటి వరకు ఇస్లామ్‌కు కట్టుబడి ఉన్నాను. దైవాదేశాల ప్రకారం నమాజు, రోజాలు పాటిస్తున్నాను. నా కుమారుడి పెళ్ళి ఒక పుట్టుకతో ముస్లిములైన వంశం లోని అమ్మాయితో నిశ్చయమైంది. కాని వారి బంధువులు కొందరు దీనికి

అభ్యంతరం పెడుతున్నారు. నేను నవముస్లింని కాబట్టి మా యింటికి తమ పిల్లను ఇవ్వరాదని చెబుతున్నారు. ఈ వివాహాన్ని అడ్డుకునే వారి గురించి ధార్మిక ఆదేశాలేమిటి?"

ముఫ్తీ కిఫాయతుల్లా ఈ ప్రశ్నకు క్రిందివిధంగా జవాబిచ్చారు.

"ధర్మపరాయణుడు, నమాజ్‌రోజాలు పాటించే నవముస్లింకు అమ్మాయిని ఇచ్చి పెళ్ళిచేయడం ధర్మసమ్మతం మాత్రమే కాదు, చేయవలసిన పని, పుణ్యకార్యం కూడాను. ఇలాంటి పనిని అడ్డుకునే వారు పాపం చేస్తున్నారు."

మరో ప్రశ్న ఒక వ్యక్తి కాయస్థ కులానికి చెందిన వాడు. ముస్లిమ్‌గా మారాడు, నమాజ్‌రోజాలు పాటిస్తున్నాడు. ఆ వ్యక్తి సయ్యద్, షేక్ సముదాయాల వారితో వివాహ సంబంధం కుదుర్చుకోగలడా లేదా? ఈ నవముస్లిం నమాజు చదవని వారిని ఇష్టపడడు. ఈ పరిస్థితిలో ఏంచేయాలి?

ముఫ్తీ అజీజుర్రహ్మాన్ ఉస్మానీ దేవ్‌బంద్ ఇచ్చిన జవాబు:

"షేక్, సయ్యద్ సముదాయాలతో ఆ నవముస్లింకు వివాహ సంబంధం కుదుర్చుకునే సరిజోడి (కుఫ్) లేదు. అయితే ఎవరైనా నవ ముస్లిం లేదా ఇతర వర్గాల అమ్మాయితో వివాహం చేసుకోవచ్చు. నమాజు చదవని వారైతే, నచ్చచెప్పి నమాజులు చదివేలా చేయాలి. నికాహ్ సరిగా జరుగుతుంది. ఎందుకంటే ముస్లిం కాబట్టి."

(ఫతావా దారుల్ ఉలూమ్ దేవ్‌బంద్)

ఇక్కడ ఆలోచించవలసిన విషయమేమంటే, ముఫ్తి కిఫాయతు ల్లాగారు ఇచ్చిన జవాబుకు, ముఫ్తి అజీజుర్రహ్మాన్‌గారు ఇచ్చిన జవాబుకు మధ్య ఇంత తేడా ఎందుకు? ఏ కారణాల వల్ల వచ్చింది? ఇద్దరూ ముఫ్తీలే,

ఇద్దరు దేవ్‌బంద్ విద్యాలయానికి చెందినవారే. ఇద్దరు ఒకేకాలానికి చెందినవారు. కాని ఇద్దరి జవాబులు విభిన్నంగా ఉన్నాయి.

దీనికి కారణమేమంటే, నేడు చాలా మంది ముఫ్తీలు దైవగ్రంథం, ప్రవక్త ప్రవచనాలు, ఇజ్తిహాద్‌ల మధ్య ఉన్న స్థాయిభేదాలను పట్టించుకోవడం లేదు. వాటన్నింటిని సమాన స్థాయి కలిగినవిగా భావిస్తున్నారు.

ముఫ్తీ కిఫాయతుల్లా ఫత్వా ఇచ్చేటప్పుడు ధర్మవేత్తల ఇజ్తిహాద్‌ల కన్నా దైవగ్రంథం, ప్రవక్త ప్రవచనాలకు అధిక ప్రాధాన్యం ఇచ్చినందువల్ల (అలా ఇవ్వడం తప్పనిసరి). ఆయన ఇచ్చిన ఫత్వా ముఫ్తీ అజీజుర్రహ్మాన్ ఇచ్చిన ఫత్వాకు భిన్నంగా ఉంది. కాని ముఫ్తీ అజీజుర్రహ్మాన్ ధర్మవేత్తల ఇజ్తిహాద్‌కు మాత్రమే ప్రాముఖ్యం ఇచ్చారు (నిజానికి ఇజ్తిహాద్‌కు రెండవస్థాయి మాత్రమే ఉంది).

## జాతి, వంశం, కుటుంబాల విషయంలో కఫాఅత్

వివాహసంబంధాల విషయంలో అన్నింటికన్నా ముఖ్యమైన సమస్య వంశం, సముదాయాల పరంగా సరిజోడికి సంబంధించినది. కొందరు ధర్మవేత్తలు మానవాళిని రెండు ముఖ్యమైన సముదాయాలుగా విభజించారు. వారి ప్రకారం అరబ్బేతర పురుషుడు అరబ్బు స్త్రీకి సరిజోడి కాదు. అరబ్బేతర ధర్మవేత్త కూడా అరబ్బు అజ్ఞాన స్త్రీకి సరిజోడి కాదు.

జాతిపరంగా సరిజోడి ఉండాలని వాదించే ఫిఖావేత్తలు క్రింది ఆధారాలు చూపిస్తారు:

**మొదటి ఆధారం**

"స్త్రీలకు వారితో సరిజోడి (కుఫ్) అయినవారితో పెళ్ళి చేయండి.

వారి పెళ్ళి కేవలం వారి సంరక్షకులు మాత్రమే చేయాలి. వారి మహర్ పది దిర్హములకు తక్కువ ఉండరాదు." (దార్ ఖతనీ)

ఈ హదీసు ప్రామాణికమైనది కాదని హదీసువేత్తలు ఏకాభిప్రాయం వెలిబుచ్చారు. కాబట్టి ఇది ఆధారంగా చెప్పడం కుదరదు. రెండవ విషయమేమంటే, ఈ హదీసు కూడా సరిజోడి విషయంలో జాతిని ప్రస్తావించలేదు.

**రెండవ ఆధారం**

"మీ సంతానం కోసం మంచి అమ్మాయిలను ఎన్నుకోండి. సరిజోడి అయిన అమ్మాయిలతో పెళ్ళి చేయండి. సరిజోడి అయినవారికి అమ్మాయిని ఇవ్వండి." (ఇబ్ను మాజా, దార్ ఖతనీ)

చాలామంది హదీసువేత్తలు ఈ హదీసును ప్రామాణికమైనదిగా భావించడం లేదు. ఈ హదీసు కూడా వివాహసంబంధం విషయంలో జాతిని ప్రస్తావించలేదు.

**మూడవ ఆధారం**

"అలీ మూడు విషయాలలో ఆలస్యం ఎప్పుడు చేయవద్దు. నమాజు వేళ అయినప్పుడు, జనాజా సిద్ధమైనప్పుడు, తగిన జోడి దొరికినప్పుడు కన్యకు పెళ్ళిచేయడంలో." (తిర్మిజి)

ఇందులో జాతిపరమైన సరిజోడి గురించిన ప్రస్తావన లేదు.

**నాలుగవ ఆధారం**

నాలుగవ ఆధారంగా, హజ్రత్ ఉమర్ (రజి) చెప్పిన మాటలు :

"నేను వంశ ఔన్నత్యం కలిగిన స్త్రీకి ఆమెకు సరిజోడి అయిన వ్యక్తితో వివాహానికి మాత్రమే ఒప్పుకుంటాను. దీన్ని వ్యతిరేకించడాన్ని అడ్డుకుంటాను."

ఈ వ్యాఖ్య కూడా నమ్మదగ్గదిగా కనబడదు. ఎందుకంటే స్వయంగా హజ్రత్ ఉమర్ (రజి) ఆచరణ ఇందుకు విరుద్ధంగా ఉంది. ఆయన కేవలం ధర్మపరాయణత్వం కారణంగా ఒక గుడిసెలో ఉండే నిరుపేద అమ్మాయితో తన కుమారుడి పెళ్ళి జరిపించారు. ఆ అమ్మాయి వంశంతో పెళ్ళి సంబంధాన్ని అరబ్బులు నీచంగా భావించేవారు. అంతేకాదు తన కుమార్తె హజ్రత్ హఫ్సా (రజి)కోసం అరబ్బేతరుడు, స్వేచ్ఛపొందిన బానిస హజ్రత్ సల్మాన్ ఫార్సి (రజి)తో పెళ్ళి సందేశం పంపించారు.

**ఐదవ ఆధారం :**

"నాలుగు అంశాల ఆధారంగా స్త్రీలను వివాహమాడడం జరుగుతుంది. ఆమె సంపద కారణంగా, ఆమె వంశం కారణంగా, ఆమె సౌందర్యం కారణంగా, ఆమె ధర్మపరాయణత్వం కారణంగా. మీరు ధర్మపరాయణత్వం, నైతికత కలిగిన స్త్రీలను వివాహమాడండి. దైవం మీకు మేలు చేస్తాడు."

ఇది ప్రామాణికమైన హదీసు. కాని దీన్ని అర్థం చేసుకోవడంలో పొరబాటు చేయడం జరుగుతోంది. ఈ హదీసులో స్త్రీలను వంశం, సంపద, సౌందర్యం చూసి పెళ్ళాడాలని చెప్పడం జరగలేదు. సమాజంలో ప్రబలంగా ఉన్న వైఖరులను వివరిస్తూ ధర్మపరాయణత్వం ఆధారంగా మాత్రమే వివాహాలు జరగాలని చెప్పడం జరిగింది.

అల్లామా అబుల్ హసన్ అలీ బిన్ ముహమ్మద్ కినానీ (రఅ), అల్లామా జలాలుద్దీన్ సూతీ (రఅ) ఇలా రాశారు : "ఈ హదీసులో ప్రజల వైఖరిని వివరించడం జరిగింది. ధర్మపరాయణత్వం ఆధారంగా పెళ్ళి జరగాలని చెప్పి మిగిలిన వైఖరులను వ్యతిరేకించడం జరిగింది."

**ఆరవ ఆధారం :**

ఇమామ్ సర్‌ఖసీ (రఅ) ఈ విషయమై వ్యాఖ్యానిస్తూ, వివాహ సంబంధాలలో సరిజోడి ముఖ్యంగా జాతిపరమైన సరిజోడి గురించి వివరిస్తూ, బద్ర్ యుద్ధం సందర్భంగా ప్రవక్త (స) అన్సారులను జాతి పరమైన సరిజోడి కారణంగా వెనక్కిపిలిచి, శత్రువులను ఎదుర్కోవడానికి హజ్రత్ అలీ (రజి), హజ్రత్ హమ్జ (రజి), హజ్రత్ ఉబైదా (రజి)లను పంపించారు. అందువల్ల యుద్ధంలో జాతిపరమైన సరిజోడి గురించి ఆలోచించినప్పుడు, అమ్మాయి తనను తాను అమ్ముకునే వివాహం వంటి సున్నితమైన వ్యవహారంలో ఈ ప్రాముఖ్యం ఎందుకు ఉండదని అన్నారు. (అల్‌మబ్సూత్)

ఈ వాదన బలహీనమైనది. యుద్ధంలో అన్సారులను వెనక్కి పిలిచి ముహాజిరులను ముందుకు పంపడాన్ని వివాహసంబంధంలో జాతిపరమైన సరిజోడికి ఆధారంగా భావిస్తే, హజ్రత్ జైద్ బిన్ హారిస్ (రజి), ఉసామా బిన్ జైద్ (రజి)లను సైన్యానికి నాయకులుగా నియమించిన ఉదాహరణ కూడా ఉంది. ఈ ఇద్దరు కూడా అన్సారులే. వారు నాయకులుగా ఉన్న సైన్యంలో పేరుప్రఖ్యాతులున్న ముహాజిరులు కూడా ఉన్నారు. అందువల్ల జాతిపరమైన సరిజోడి అన్నది లేదన్న విషయం అర్థం అవుతుంది.

రెండవ విషయమేమంటే, సరిజోడి కాదన్న కారణంగా ప్రవక్త (స) అన్సారులను వెనక్కి పిలువడం జరిగి ఉంటే, ఆ యుద్ధం తర్వాత అన్సారులు, ముహాజిరీన్ల మధ్య వివాహ సంబంధాలు ఎలా ఏర్పడ్డాయి.

ఇమామ్ సర్‌ఖసీ (రఅ) జాతిపరమైన సరిజోడి విషయంలో ఇంకో ఆధారం చూపిస్తూ ఏమన్నారంటే, నికాహ్ వల్ల పురుషునికి స్త్రీపై ఆధిక్యతా హక్కులు లభిస్తాయి. ఒకవిధంగా ఇది పరాభవం. అందుకే ప్రవక్త (స) ఇలా అన్నారు "పెళ్ళి ఒకవిధమైన బానిసత్వం వంటిది. అందువల్ల మీరు మీ

అమ్మాయిని ఎక్కడ పంపుతున్నారో చూడాలి. అంటే పెళ్ళి ఎక్కడ చేస్తున్నారన్నది గమనించాలి."

"వ్యక్తి సరిజోడి కాని పెళ్ళి చేసుకుని తన సంతానాన్ని పరాభవానికి గురిచేస్తాడు. తన ఆత్మను పరాభవం పాలు చేయడం నిషిద్ధం. ఎందుకంటే ప్రవక్త (స) ఇలా అన్నారు : "తన్ను తాను పరాభవం పాలు చేసుకునేవాడు కాదు విశ్వాసి". అందువల్ల పెళ్ళిలో జాతి, వంశం వగైరాల సరిజోడి ఉండాలి." (కితాబుల్ మబ్సూత్)

ఇమామ్ బైహాకి ఈ హదీసు ప్రామాణికమైనది కాదన్నారు.

ఇస్లాం ధర్మం పుట్టుక రీత్యా, వంశం రీత్యా నిమ్నోన్నతలను విభజిస్తుందని ఇమామ్ సర్ఖసీ (రఅ) నిరూపించిఉన్నట్లయితే ఆయన మాటలను అంగీకరించడానికి అవకాశం ఉండేది. హదీసుగా చెబుతున్న ఈ మాటలు దైవగ్రంథం, ప్రామాణిక హదీసుల బోధనలకు వ్యతిరేకంగా ఉన్నాయి. ఇలాంటి మాటలను ప్రవక్త ప్రవచనాలని చెప్పడం ఇస్లామ్‌ను, ప్రవక్త (స)ను అప్రతిష్ఠపాలు చేయడమే అవుతుంది.

**ఎనిమిదవ ఆధారం :**

ప్రజలు తమ వంశం కుటుంబాల విషయమై గర్విస్తారు కనుక వివాహంలోను ఈ విషయమై సరిజోడి ఉండాలని చెబుతారు.

ఈ మాటలు దైవగ్రంథం, ప్రవక్త ప్రవచనాల స్ఫూర్తికి విరుద్ధమైనవి. ఈ క్రింది హదీసు ఈ విషయాన్ని స్పష్టంగా ప్రకటిస్తుంది.

"రెండు విషయాలు ప్రజలను దైవతిరస్కారానికి దగ్గర చేస్తాయి. అవి : ఒకటి, ఇతరులను తన తక్కువ జాతివారని భావించడం....."

**తొమ్మిదవ ఆధారం :**

"కొందరు అరబ్బులు కొందరు అరబ్బులకు సరిజోడి, కొందరు

అరబ్బేతరులు కొందరు అరబ్బేతరులకు సరిజోడి. నేతపనివారు, క్షురకులు తప్ప." (హాకిమ్, దార్ ఖుతనీ)

ఈ మాటలు దైవగ్రంథం, ప్రామాణిక హదీసులు, ప్రవక్త అనుచరుల ఆచరణలకు విరుద్ధమైనది. ఈవిషయాన్ని వృత్తిపరమైన సరిజోడి గురించి మాట్లాడుకున్నప్పుడు చెప్పుకున్నాము. జాతి, వృత్తులకు వ్యతిరేకంగా కనబడే హదీసులు ప్రామాణికమైనవి కావని హదీసువేత్తలు నిర్ధారించారు.

**పదవ ఆధారం**

పదవ ఆధారంగా ఇంకో హదీసు చెబుతారు :

"దేవుడు ఇబ్రాహీం (అస) సంతానంలో ఇస్మాయీల్ (అస)ను ఎన్నుకున్నారు. ఆయన సంతానం నుంచి బనూ కినానాను వేరు చేసాడు. అందులో నుంచి ఖురైషులను ఎన్నుకున్నాడు. వారిలో బనూ హాషింను ఎంచుకున్నాడు. బనూ హాషిం నుంచి నన్ను ఎన్నుకున్నాడు" (ముస్లిం)

ఈ హదీసు ప్రామాణికమైనదే. కాని వంశపరమైన ఔన్నత్యాన్ని ఈ హదీసు సూచిస్తుందని చెప్పడం కుదరదు. ఎందుకంటే, అత్యంత ప్రామాణికమైన హదీసు "నేను ఆదం సంతానానికి నాయకుడిని. ఎలాంటి గర్వం ఇందులో లేదు" (మిష్కాత్) అని పేర్కొనడం జరిగింది.

జాతిపరమైన ఆధిక్యం హదీసు మాటల్లో లేదు. ప్రవక్త (స) తన గుర్తింపును, పరిచయాన్ని తెలుపడానికి ఈ మాటలు అన్నారు. ఈ హదీసును జాతిపరమైన ఔన్నత్యానికి ఆధారంగా చెప్పడం అవివేకం అవుతుందని హాఫిజ్ ఇబ్నె హజర్ (రఅ) అన్నారు.

**పదకొండవ ఆధారం**

ఇక పదకొండవ ఆధారంగా హజ్రత్ సల్మాన్ ఫార్సి (రజి)

ఉటంకించిన హదీసును చూపిస్తుంటారు. "ప్రవక్త (స) మమ్మల్ని (అరబ్బే తరులను) అరబ్బు మహిళలతో పెళ్లాడరాదని నివారించారు." (తిబ్రానీ)

మరొక హదీసులో హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజి) అరబ్బులను ఉద్దేశించి "మేము మీకు నాయకత్వమూ వహించలేము. మీ మహిళలతో వివాహమూ చేసుకోలేము" (తిబ్రానీ) అన్నారని ఉంది.

కాని ఈ రెండు హదీసులు ప్రామాణికం కావు. ఎందుకంటే అరబ్బు అన్న పదం ఉన్న హదీసులు ప్రామాణికమైనవి కాదని హదీసు వేత్తలు నిర్ధారించారు.

ఇక నాయకత్వం (ఇమామత్)కు ఎవరు యోగ్యులన్నది చెప్పే హదీసులు అనేకం ఉన్నాయి. ఏ ఒక్క హదీసులోను అరబ్బు, అరబ్బేత రుడన్న విభేదం ఎక్కడా లేదు. స్వయంగా హజ్రత్ సల్మాన్ ఫార్సి (రజి) ఆచరణలు కూడా ఈ మాటలకు వ్యతిరేకంగా ఉన్నాయి. ఆయన ఒకరి తర్వాత ఒకరుగా హజ్రత్ అబూబక్ర్ (రజి), హజ్రత్ ఉమర్(రజి) కుమార్తె లకు వివాహ సందేశాన్ని పంపించారు. అలాగే నల్ల బానిస అయిన హజ్రత్ బిలాల్ (రజి) వివాహం ప్రముఖ ఖురైష్ వంశస్థుడు హజ్రత్ అబ్దుర్రహ్మాన్ ఔఫ (రజి) సోదరి హజ్రత్‌హాలా బింతె ఔఫ (రజి) తో జరిగింది.

వంశం, జాతి ఆధిక్యత పట్ల మొగ్గుచూపే కొందరు ధర్మవేత్తలు తమ వాదనకు చూపించే పన్నెండవ ఆధారంగా కొందరు ముస్లిమ్ పాలకులు అవలంబించిన ఇస్లామేతర విధానాలను చూపిస్తుంటారు. దీన్ని బట్టి తెలిసేదేమంటే, దేశంలో కులతత్వం, వంశపరమైన ఔన్నత్యాల భావన ఎంత బలంగా ఉందంటే చివరికి బలహీనమైన ఆధారాలతో అయినా సరే దానిని నిరూపించడానికి ప్రయత్నిస్తున్నారు. నిజానికి ఈ నిమ్నోన్నతలను అంతం చేయడానికే ఇస్లాం అవతరించింది.

ఇక్కడి కొందరు హనఫీ ధర్మవేత్తలు ఇచ్చే ఫత్వాలు పరిశీలిస్తే, చిన్న జాతులవాళ్ళు, నేతపనివారు, చర్మకారులు, క్షురకులు వగైరా జాతుల వారు ధార్మిక పండితులైనప్పటికీ వాళ్ళు పెద్దజాతుల వారికి సరిజోడి కాదంటారు. ఈ ఫత్వాలను ఖండిస్తూ హదీసువేత్త హబీబుర్రహ్మాన్ ఆజ్మీ హనఫీ చెప్పిన మాటలు గమనించదగినవి. 'ఇదే వైఖరి ఆచరణలో ఉన్నట్లయితే ఇది తప్పుడు వైఖరి. ఎందుకంటే ధార్మిక పాండిత్యం వల్ల లభించే గౌరవం జాతిపరమైన గౌరవం కన్నా ఉన్నతమైనదని స్పష్టంగా ప్రామాణిక గ్రంథాల్లో ఉంది. కాబట్టి ఒక అరబ్బేతరుడైన ధార్మికపండితుడు అతను నేతపనివాడైనా లేక క్షురకుడైనా గాని ఒక సయ్యద్ మహిళకు సరిజోడియే అవుతాడు. ప్రవక్త (స) ఆచరణ కూడా ఈ విషయాన్నే ధృవీకరిస్తోంది.

ఇక పదమూడవ ఆధారాన్ని చూద్దాం, సయ్యద్‌లకు జకాత్ ఇవ్వడం ధర్మసమ్మతం కాదు. ఒకవేళ సయ్యద్ మహిళ సయ్యదేతరుణ్ణి పెళ్ళి చేసుకుంటే జకాత్ తీసుకుని అనుభవించే అవకాశం ఉంది. ఆవిధంగా నిషిద్ధమైన పనిచేసే అవకాశం ఉంది.

ఈ వాదన ప్రవక్త (స) ఆచరణకు విరుద్ధమైనది. ఆయన స్వయంగా తన ముగ్గురు కుమార్తెల వివాహాలను హాషిం వంశానికి బయట ఇచ్చి వివాహం చేసారు. ఆయన కాలంలోనే హాషిమ్ వంశానికి చెందిన అనేక మంది ఇలాగే చేసారు. కాబట్టి ఈ వాదన ద్వారా జాతిపరమైన ఔన్నత్యాన్ని నిరూపించాలనుకుంటున్న వాళ్ళు తమకు దైవప్రవక్త (స) కన్నా ఎక్కువ ధర్మం తెలుసన్నట్లు వ్యవహరిస్తున్నారని చెప్పవలసి ఉంటుంది.

ఇక పద్నాలుగవ ఆధారంగా వీళ్ళు చూపిస్తున్న విషయమేమంటే, తమ సముదాయంలో, వంశంలో సరిజోడిచూసి చేయడం పెళ్ళి సందర్భంగా అవసరమని చెప్పడం. ఇక్కడ ఆలోచించవలసిన విషయమేమంటే,

దైవగ్రంథం, ప్రవక్త ప్రవచనాలకు అనుగుణమైన అంశాన్నే పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది. ధర్మపరాయణత్వం, దైవభీతుల కన్నా జాతి, సముదాయాలకు అధికప్రాముఖ్యం ఇవ్వడం ఇస్లామ్‌కు వ్యతిరేకం. ప్రవక్త (స) హాషిమ్, ఖురైష్, అరబ్బు స్త్రీల వివాహాలను ఇతర సముదాయాల పురుషులతో చేయించారన్నది కూడా ఇక్కడ దృష్టిలో ఉంచుకోవాలి. అంతేకాదు, హజ్రత్ జైనబ్ (రజి) తప్ప మిగిలిన స్త్రీలందరి వివాహాలు సంతోషకరంగా గడిచాయి. ఉదాహరణకు ఫాతిమా బింతె ఖైస్ (రజి) తన ఆనందకరమైన వైవాహిక జీవితం గురించి తెలుపుతూ దేవుడు నాకు ఉసామా బిన్ జైద్ (రజి) వంటి వ్యక్తితో జీవితం పంచుకునే సౌభాగ్యం ప్రసాదించాడు. నేను ఆయనతో ఆనందకరమైన జీవితం గడిపాను అన్నారు. (నిసాయి)

హజ్రత్ జైనబ్ బింతె జహష్ (రజి) పెళ్ళి విడాకులకు దారితీయడానికి కారణం సముదాయం బయట వివాహం చేసుకోవడం కాదు. ఈ విడాకులకు అనేక కారణాలున్నాయి. అందులో ఒక కారణమేమంటే, అజ్ఞానకాలంలో ప్రాబల్యంలో ఉన్న ఒక తప్పుడు ఆచారాన్ని తొలగించడం కూడా. ఈ విషయాన్ని దైవగ్రంథం ఇలా ప్రకటించింది.

**".. తర్వాత జైద్ ఆమె విషయంలో తన అవసరాన్ని పూర్తి చేసుకున్నప్పుడు, మేము ఆమె (విడాకులు పొందిన స్త్రీ)తో నీకు వివాహం జరిపించాము. విశ్వాసులకు తమ దత్త పుత్రుల భార్యల విషయంలో వారు తమ భార్యలకు సంబంధించిన తమ అవసరాన్ని పూర్తి చేసుకున్నప్పుడు ఏవిధమైన ఇబ్బంది కలుగకుండా ఉండేందుకు. అల్లాహ్ ఆదేశం అమలులోకి రావలసిందే"**

*(అల్ అహ్జాబ్ : 37)*

దురదృష్టవశాత్తు నేడు ముస్లిముల్లోను నిమ్నోన్నతల భేదాలు కానవస్తున్నాయి. ఫలితంగా ఇస్లామ్ ప్రచారంలో తీవ్ర నష్టం వాటిల్లుతోంది.

డాక్టర్ అంబేద్కర్ మతం మార్చుకుంటున్న విషయాన్ని ప్రకటించినప్పుడు మౌలానా హిఫ్జుర్రహ్మాన్ సీహార్వి ఆయన వద్దకు వెళ్ళి ఇస్లామ్‌లో ఉన్న సమానత్వ భావన గురించి తెలిపినప్పుడు డా. అంబేద్కర్ తన అల్మారాలో ఉన్న పుస్తకాలను చూపిస్తూ "మౌలానా ఆ అల్మారాలో ఉన్న పుస్తకాలను చూస్తున్నారు కదా. ఇవన్నీ ఇస్లాంకు సంబంధించిన పుస్తకాలే. నేను సయ్యద్ అమిర్ అలీ, మౌలానా అబ్దుల్లా యూసుఫ్ అలీ, ఇంకా అనేకమంది ముస్లిం, నవముస్లిం, ముస్లిమేతర మేధావుల పుస్తకాలను చాలా పరిశీలనా దృష్టితో చదివాను. సైద్ధాంతికంగా ఇస్లామ్ సామాజిక సమానత్వానికి ప్రతిబింబం. కాని భారతదేశంలో మీరు కూడా మను చెప్పిన వర్ణాశ్రమ విధానాన్నే అవలంబిస్తున్నారు. మీరు కూడా జాతి, వంశాల విభజనకు గురై ఉన్నారు. నేను ఇస్లాం స్వీకరిస్తే మీరు నన్ను ఏ స్థాయిలో ఉంచుతారు?" అని ప్రశ్నించారు.

డాక్టర్ అంబేద్కర్ చెప్పిన మాటలు దేశంలో ముస్లిములకు గుణపాఠం గరిపే మాటలు. మనం ఇస్లాం బోధనలకు ఎంతదూరమై పోయామో ఈ మాటల వల్ల తెలుస్తుంది. ఇస్లాం స్వరూపాన్ని ఎంతగా మార్చివేసామో ఈ మాటలు తెలుపుతున్నాయి.

- : సమాప్తం : -